శ్రీ

కామేశ్వర్యై నమః.

# ఉపోద్ఘాతము

శా. క్షాంతిశ్చే ద్వచనేన కిం కిమరిభిః క్రోధోస్తిచే ద్దేహినాం,
జ్ఞాతిశ్చే దనలేన కిం యది సుహృద్దివ్యౌషధైః కిం ఫలం,
కిం సర్పైర్యది దుర్జనాః కిము ధనైర్విద్యాఽనవద్యాయది,
వ్రీడాచేత్కిము భూషణైస్సుకవితాయద్యస్తి రాజ్యేనకిం.

"భర్తృహరి"

శ్లో. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయో పదేశయుజే.

"కావ్యప్రకాశిక"

"విద్యలలోపల నుత్తమ విద్య కవిత్వంబు"

అప్పకవి.

"పుణ్యశ్లోకస్య చరిత ముదాహరణ మర్హతి" యని ప్రాజ్ఞులానతిచ్చుచున్నారు. ఉదార వర్తనము గలిగి లోకోపకార పరాయణులై జీవితము గడిపిన యొక మహాపురుషుని పుణ్య చరిత్రము జగమునకు మార్గదర్శకమై తనరారఁగలదు. దేశ చరిత్రములకుఁగూడ పాత్రప్రాశస్త్యము బట్టి దీసిని గ్రహింపఁదగు. ఒక దేశమునందు జనించి వసించి వర్తించి చనిన మహాపురుషుల వేర్వేఱు చరిత్రముల నొకచోఁ జేర్చుటయే యాదేశము చరిత్రము. మహానాయకుల జీవితచరిత్రములను విడిచి దేశ చరిత్రమును జూచిన, నొక్కకాసైనఁ జేయదు. నాయక చరిత్రములను వ్రాసి యారాధించుట వీరపూజయందొక యుత్తమ మార్గ మగుచున్నది.

స్వాయంభువ మనువున కుత్తానపాదుఁ డుదయించెను. సునీతి సురుచు లతని పత్నులు. సురుచి బాహ్యాంగసౌష్ఠవ రుచులచే భర్తహృదయము నాకర్షింపఁ గలిగెను. అందువలన నతఁడు సునీతి నించుక దూరమున నిలిపెను. ఒకనాఁడు సురుచి కన్నకొడుకు నుత్తముని యంకమున నిడికొని యుత్తానపాదుఁడు మురియుచుండెను. ధ్రువుఁ డంతట వచ్చి తండ్రి యుపలాలనమును గాంక్షించెను. సరసనున్న సురుచి తూలనాడెను. తనగర్భంబున జనింపఁజేయుమని యంబుజగర్భునిగూర్చి తపంబొనరింపుము పొమ్మని కసిరెను. ఉత్తానపాదుఁడూరకుండెను. పినతల్లి వేఁడిపలుకులకు ధ్రువుఁడు కాఁకయువడి బుడిబుడి యేడ్చుచు ఘోరారణ్యంబులకుఁ బ్రయాణమయ్యెను. త్రిలోకారాధ్య చరిత్రుఁడగు నారదుఁడు మార్గమునఁ గలిసెను. యమునాతటమున మధువనమున కేగి హరి నారాధింపుమని బోధించెను. అనవరత ధ్యానప్రవణ చిత్తుఁడై నిజజనకుని నాకర్షింపఁజాలని రోసమున నాపసికూన చతుర్దశలోక జనకుని గూర్చి తపముసేయఁ దొడంగెను. బాలభక్తునియెడ వాత్సల్యమున శ్రీమన్నారాయణుండు ప్రత్యక్షమయ్యెను. కొంతకాలము రాజ్యమేలి పిదప శ్రీవిష్ణుపదముఁ బ్రాపింపుమని విష్ణుఁడు తిరోహితుఁడయ్యెను. చిరకాల ప్రణయబద్ధ మృదుహృదంతరుండగు నుత్తానపాదుఁడు కొమరుఁడూఁకువిడిచినది మొదలెంతయు దురపిల్లుచుండెను. కడకు ధ్రువుఁ డేతెంచి కన్నులపండువు గావించెను. ధ్రువుఁడు తద్దయు, గాలము రాజ్యమేలి యనేక మఖములొనరించెను. అనంత నక్షత్ర మండలములును సప్తర్షి ప్రవరులును బ్రదక్షిణించుచు సంవర్త సమయముననైనఁ జెడని పున

రావృత్తిరహిత శాశ్వతపదముఁ గాంచి నేటికి నంతటి మహాను భావుఁడు లేఁడని లోకంబులు సమనుస్మృతిసేయ జ్యోతిర్మయ మూర్తియై ధ్రువుఁడు వెలుఁగుచున్నాఁడు. పాశ్చాత్యులుగూడ నితనిని (North Pole Star)అని గౌరవించుచున్నారు. భారత దేశమహాపురుషులలో ధ్రువుఁడుత్తమోత్తముఁడు. భాగవతమున,

మ. హరిమధ్యల్ పురకామినీమణులు సౌధాగ్రంబులందుండి భా
స్వర సిద్ధార్థ ఫలాక్షత ప్రసవ దూర్వావ్రాత దధ్యంబువుల్
గరవల్లీ మణి హేమకంకణ ఝణత్కారంబు శోభిల్లఁ జ
ల్లిరి యాభాగవతోత్తమోత్తమునిపై లీలాప్రమేయంబుగన్

అని యితఁడు భాగవతోత్తమోత్తముఁడుగాఁ జెప్పఁబడి యున్నాఁడు.

ఈ ధ్రువచరిత్రము వ్రాసి యుపకరింప నుద్యమించిన యీకవి నైజాము మండలాంతర్గత శ్రీ జటప్రోలు సంస్థానమునకుఁ జేరినవాఁడు. శ్రీవైష్ణవ వంశసంభూతుఁడు. గంధాన్వయ ప్రభవుఁడు. తాయారంబా కృష్ణమాచార్యుల పుత్రుఁడు. నృసింహాచార్యాభిధానుఁడు. ఇంతకుఁ బూర్వము మాధవశతకము వ్రాసి కీర్తి నార్జించె. ఈధ్రువచరిత్రము రచించి స్వయముగా నిచ్చటికి వచ్చి మాకు వినిపించి యుపోద్ఘాతము వ్రాయుఁడని యర్థించినందులకు నందందుఁ బన్నీరుచిలికి నట్లొక్కొక్క యక్షరమును జేర్చుట తప్ప మే మొనర్చిన సంస్కారము వేఱొండు లేదని చెప్పుచున్నాము.

ఈకవికవిత్వము సరళమై సులభబోధకములగు పదములతోఁగూడి యర్థవంతమై, యొప్పుచున్నది. కథాకథనమున కడ్డుదగులు ననవసర వర్ణనము లిందుఁ గన్పట్టక, భావముపైఁ

గన్నుంచి వ్రాయఁబడిన దగుటచేఁ బండిత పామరజన హృదయంగమమై యలరారుచున్నది. ఈచరిత్రము నేకాశ్వాసముగ వ్రాసి యీకవి తనయులు వేలుపగు శ్రీవేంకటేశ్వర చరణసరోజముల కంకిత మొసఁగెను. శైలీపరిదర్శనార్థ మొకపద్యము నుదాహరింతుము.

చ. అనుపమరూపయౌ సురుచియల్లిన పూవులసంకెలల్ గళం
బున నరికట్టఁ గట్టువడి పూజ్యగుణాఢ్య సునీతి రోసి నా
తనయుని వంశవర్ధను నెదన్ గరుణింపక తిట్టికొట్టఁగా
విని సహియించితిన్ సురుచిప్రీతి గడింపఁగమూర్ఖబుద్ధినై. 80.

ఈపొత్తము బాలికా బాలుర కత్యంతోపయుక్తమగుటంజేసి సంస్థానం దీవిద్యాశాఖాధికారులు దీనిని బాఠశాలలలోఁ బఠనీయముగ నియమించి కవిని బ్రోత్సహింతురుగాక.

అనేక పండితులను కవులను నాస్థానమునఁజేర్చి యాశ్రయమిచ్చి సకలవిధముల నాదరించి జగదుపకారకములగు కృతులు వ్రాయించి ప్రోత్సహించు నుదారమృదుహృదయులు శ్రీజటప్రోలు సంస్థాన మహారాజ్ఞీ శిరోమణులు శ్రీసురభి వెంకటరత్నమాంబగారిని మే మభినందించుచున్నాము. సుధాసాగరమువలె వారి సురభివంశము శాశ్వత యశోభరితమై యాశ్రిత సురభియై యలరారుఁగాతమని కోరుచు నింతటితో నుపరమించుచున్నాము.

ప్రొద్దుటూరు,<br>9 మార్చి 1932.

ఇట్లు,<br>కవిసింహ & అవధానిపంచానన<br>రాజశేఖర వెంకటశేషకవులు,<br>శతావధానులు.

# అభిప్రాయము.

---

శ్రీజటప్రోలు సంస్థానములో చేరిన కొల్లాపురమందు నివసించుచున్న శ్రీమాన్ గంధం నరసింహాచార్యులవారు రచియించిన ధ్రువచరిత్రమను పద్యకావ్యమును చదివించుకొని వింటిని. ఆచార్యులవారి కవిత్వము లలితమై సులభమై రసవంతమై యున్నది. వీరింక ననేక గ్రంథములు రచించి భాషాసేవ చేయునట్లు భగవంతుఁడు వీరికి సామర్థ్యము ప్రసాదించుగాక. ఈగ్రంథము పాఠశాలలోని బాలబాలికలకు మిగుల నుపయోగకరముగా నుండుగావున విద్యాశాఖాధికారులు దీనికి తగినంత ప్రోత్సాహము నొసంగుదురుగాక.

రాజమహేంద్రవరము, 9—4—32.

డాక్టరు, చిలకమర్తి లక్ష్మీనరసింహము,
ఆంధ్రసాహిత్యచక్రవర్తి.

ఓం.

# ధ్రువచరిత్రము.

ఉ. శ్రీమహనీయుఁడై సుజన సేవితుఁడై మునిలోక గేయుఁడై
కామిత దాయియై యసుర ఖండనుఁడై దశరూప ధారియై
యేమహనీయుఁడొప్పు జగమేలుచు నట్టి కృపాంతరంగుఁడే
ష్ఠోముత నన్ను నక్కటిక మూనుచు సర్వఫలప్రదాతయై. 1

సీ. మెప్పించినావు భూమిపతి లక్ష్మారావు
నారంభమున గైత మల్లునపుడె
యిప్పించినావు నన్నెల్లరు మెచ్చంగ
నూరును మఱిఁ బదియారు వేగ
వ్రాయించినావు బల్ సాయంబుగా నిల్చి
మాధవ శతకంబు మమత మీఱఁ
జేయించినావు మేల్జేసి వైవాహికం
బాదిగా మాకు కార్యముల నెన్నొ

గీ. యెట్లు రక్షించెదో నన్ను నింక మీద
నమ్మియుంటినిగాదె యో నలువరాణి
నాదు వాక్కున నిల్చి సమ్మోద మొప్ప
సతము దయజూడుమున్మ్రొక్కి నిన్ సన్నుతింతు. 2

సీ. భారతామ్నాయంబుఁ బదుగురు తలలూప
వ్రాసిన యాల కవిత్రయము నెంచి

భాగవతాఖ్య కావ్యముఁ దెనుంగున వ్రాసి
ధర నతిగన్న పోతన్న నెంచి
నైషధ కావ్యంబు నవ్యవైఖరి వ్రాసి
నట్టి శ్రీనాథునిఁ నాత్మఁబొగడి
శ్రీరామచంద్ర చరిత్రంబు రసమొప్ప
గను లిఖించిన భాస్కరునికి మ్రొక్కి

గీ. పెద్దనాదిగఁ దదితర పెద్దకవుల
దినము ముప్పొద్దు సద్భక్తి వినుతిఁ జేసి
యాధునిక కవిరాజుల నధికముగను
గొలుతు నెప్పుడు వాక్సిద్ధి గలుగుకొఱకు 3

గీ. వాజపేయాన్వయాబ్ధి జైవాతృకుండు
సరస కవితా రసామృతా స్వాదనుండు
వివిధ విద్యారహస్యార్థ వేదియైన
మద్గురుని రామసుబ్రాయ మదినిఁ దలఁతు. 4

మ. నను శ్రీవైష్ణవ వర్యునిన్ విమలగంధప్రాజ్య వంశాబ్ధిపూ
ర్ణనిశానాయకు కృష్ణమార్యసుతు నాంధ్రప్రౌఢ సద్యఃకవి
త్వ నిరాటంకవిహార లబ్దయశు విద్వత్పాదరాజీవ సే
వనధన్యున్ నరసింహనాము సికులొప్పన్ బ్రోవు లక్ష్మీపతీ ! 5

ఉ. ఎందరొ సత్కవీంద్రులు రచించినతొల్లిటి గ్రంథపాళి యం
దుం దిరమైన గాథలని తోఁచియుతోఁచక వ్రాయఁబూనుటే
ఛాందస మందురేమొ యది సజ్జన లక్షణమౌనె నాదు వా
నందముఁదీర వ్రాసితి గుణంబదియించుక యున్న మెచ్చరే 6.

## కథాప్రారంభము.

---

కం. మును స్వాయంభువ మనువున
కును సుతులిద్దరు సమస్తగుణ పరిపూర్ణుల్
ఘనుడు ప్రియవ్రతుఁడనువాఁ
డును మఱి యుత్తానపాదుఁడున్ ధరయందున్. 7

గీ. భార్యలుండిరా యుత్తాన పాదునకును
సురుచియు సునీతియనువార లిరువురందుఁ
బెద్దది సునీతి కడుసాధ్వి విమలచరిత
భర్తఁ బూజించు నెవ్వేళ భావమందు. 8

ఆ. వె. పెద్దభార్యకుఁడొఁ బ్రియకుమారుడు ధ్రువుం
డుత్తముండు సురుచికుండె నటులఁ
బుత్రకులను గాఁచి పుడమి నుత్తానపా
దుండు రాజ్య మేలుచుండె రక్తి. 9

కం. సురుచిర సౌందర్యంబది
సురుచికి నలవడుటఁజేసి సొంపుగ నామెన్
గరమనురక్తినిఁ జూచును
గరుణింపఁడు పెద్దభార్యఁ గాముకుఁడగుటన్. 10

చ. పలుమరు భర్తతోఁ సవతిపైఁ గినుకన్ వహియించి కొండెముల్
బలుకుచు దానుపన్నినయుపాయము సాగుటకై యతించి మా
ర్వలుకనిభర్తపై సురుచి వ్రాలుచు దిట్టుచుఁ గోపగించుచున్
భళిర ! వశంబు జేసికొనె భామిను లెంతకునైనఁ జెల్లరే. 11

చ. పతి తనుఁ బ్రేమఁ జూడదని భావమునన్ విసుగొందకెప్డు, న
మ్మతి భజియించు మున్మిగుల మాన్యగుణమ్ములఁ గాంచి భర్తయే
గతియని నమ్మికొన్న దనకష్టము లెన్నటికేని దీరునం
చతివ సునీతి కాలమునకై గని పెట్టుక యుండె నీగతిన్. 12

సీ. అరుణోదయంబునఁ ద్వరగ మేల్కని పతి
చరణాంబుజములఁ బూజల నొనర్చి
దనుఁజూడవచ్చు నుత్తమ కాంతలకు నెప్డు
కనికరంబునను దర్శన మొసంగు
దనకిట్టి గతికల్గెనని మనంబున దుఃఖ
మెఱుగక హరి భజియించుచుండు
నార్తు లెవ్వరుగాని యాచింప వచ్చిన
ఘనముగా నొసగు లేదనుటెఱుగదు

గీ. సతము పతిసేమమే కోరు శాంతి విడదు
సవతి దూరదు మదిని రోసము వహింప
దిట్టి సాధ్విని వీడి తానెపుడు సురుచి
మాయలకు జిక్కె నదియె సన్మార్గ మనుచు. 13

ఉ. ఇట్టుల నామహీవరుఁ డహీన సుఖంబుననుండి వైభవం
బుట్టిపడంగఁ దా సురుచి యుల్లము రంజిలఁ జేయఁ బ్రేమగ
న్పట్టగనుత్తమున్ సురుచి పట్టిసెఁ జెంతను గూరుచుండగా
బెట్టుక ముద్దులన్మిగుల బెట్టుచు కాలముబుచ్చు నయ్యెడన్. 14

సీ. వచ్చియు రాని సంభాషణచే నవ్వు
గలిగించు వింతపల్కులను గల్గి
యడుగడుగునకు దాఁబడుచు లేచుచు తప్పు
టడుగుల బెట్టుచు నడక గలిగి

చిరునవ్వు వెన్నెలల్ గురియుచుఁ జూపఱ
కానందభరము నియ్యంగ గలిగి
జననీ జనకులెట్టి ఘన దుఃఖమందున్న
క్షణములో బోఁగొట్టు శక్తిగల్గి
గీ. నట్టి శైశవమును దాటి యైదు వత్స
రముల ప్రాయంపు బాలుఁ డబ్రింబు గొలుపు
నాటపాటల మురియుచు నచటఁ జేరె
నీతిమంతుండు ధ్రువుఁడు సునీతి కొడుకు. 15

గీ. వచ్చి జనకుని తొడపయి భ్రాతయుండఁ
గనుచుఁ దానునుఁ గూడ నెక్కం దలంచి
చేతులెత్తఁగ నచటనే చేరియున్న
సురుచి యాతని దెస చురచురను జూచి. 16

గీ. "ఓరి! యేటికి నీరీతి గోరెదీవు
వూనఁ దొరకున యుందని మాత్రినిపండు
తండ్రి తొడపైన నెక్కఁగా ధన్యుఁడవడొ
వానికేగాక నీకట్టి భ్రాంతియేల?" 17

క. తొలిభవమునఁ జేసిన యా
ఫలమిపుడీ వనుభవింప వలవె దురాత్మా
తలపఁగ నోమాయువు దాఁ
బులియగుటకుఁ గోరి నట్లు పొందు ఫలంబుల్. 18.

చ. వడివడి వచ్చి తండ్రితొడపైన రయంబునఁ గూరుచుండినా
కొమరుడు నాటివచ్చుటకు గోరెద నేటికి యిట్టిలాభ మిా
కడఁ గన ప్రాప్తియున్న పలుగాకి సునీతికి బుట్ట కీవు నా
కడుపునఁ బుట్టియుందువు సుఖంబున కప్పుడు లోపముండునే.

గీ. తలప నీ తల్లి నాకెప్డు దాసి నీవు
దాసి పుత్త్రుఁడ వగుటచేఁ దలఁచినపుడు
వచ్చి పనులెల్లఁ దీర్చుచుఁ బ్రత్యహంబు
మమ్ము మెప్పింప మీకు శుభమ్ము గలుగు. 20

చ. కదలవదేల యింక కొడుకా! యిటురమ్మని చేరఁదీసి నీ
ముదము దలిర్పఁగా మిగుల ముద్దులుగైకొనువారు లేరు; ఛీ
వదవద శ్రీరమేశుఁ గొలువన్ జని నాకు జనింపఁగోరుమా
సదయుని కూర్మి వేఱొక జన్మమునం దదియైనఁ గల్గెడున్

గీ. అనుచు సురుచి వచించి యావంతయైనఁ
గనికరము లేక యాపట్టిఁ గరము పట్టి
యీడ్చి రాజేమియును వచియింపడయ్యె
నశ్రుపూర్ణ నేత్రాంబుజుఁడయ్యె ధ్రువుఁడు. 22

ఉ. రోసము గల్గి తల్లికడ రోదనసేయుచు బోయి సంగతిన్
పీసర బోవకుండ కడు వేదనతో వినిపించి తల్లి! యే
దోసముఁ జేసియుంటినొకొ దుర్భరతీవ్ర దురుక్తులాడి, నన్
గాసిలఁ జేసె నింక మనఁగా ఫలమేమి ధరాతలంబునన్. 23

గీ. తిట్టెఁ గొట్టగ వచ్చె నన్నట్టె త్రోసె
కరము దూషించె నిన్ను నాకతన హృదయ
యిట్లు చాలరేగినట్టి యీయింతి నకట
జనకుడైనను దండింపఁ జాలడయ్యె. 24

ఉ. నావుడుతల్లి యిట్లనియె; నాయన! యేటికిదుఃఖమొంద, నీ
కావిధి వ్రాయుచందమున నయ్యెడు నన్యులుతిట్టికొట్టినన్
దేవుడొకండు లేడె వెతఁదీర్పఁడె; యిట్టిపరాభవాగ్ని నీ
భావమునందు నెంచక నపాయసుఖంబును గూర్చు నాతఁడే.

ఉ. పోవరె తల్లిదండ్రులను మ్రొక్కఁగఁ బుత్రకు లింతమాత్రనే
కావరమూని తిట్టుదురె కన్నులఁగానకఁ దిట్టినంతనే
పోవునదేమి? నా పరువుపోయెనె "దుష్టులజూచిదూరముగ్
బోవలె" నన్న నానుడిని బుద్ధినినుంచి మెలంగు మయ్యారో!

సీ. తండ్రి నీపైనింత దయజూపఁడాయెగా
చేరఁగా జనిన నోరారఁ బిలిచి
పసివాఁడ వనియైనఁ బరికింపడాయెగా
దాయయె నీకగు తల్లియగునె
సర్వాత్మునకునైన జాలి రాదాయెగా
తొలిఫలంబును దాట నలవియగునె
దాసీజనంబు దుర్దశ పాపదాయెగా
ధనమిచ్చువారినే తవిలి కొలుచు
గీ. ఎహహ! యెంతటివారికినైనగాని
సుఖము దుఃఖము దప్పదుసుమ్ము పుత్ర!
గానఁ జింతను విడి శ్రీకమలనాభు
భజన సలుపుము నిర్మల భక్తితోడ. 27

గీ. ప్రజల నాదటఁ దనుగన్న ప్రజలఁగుల్లు
ప్రోచు విశ్వకుటుంబినీ ముద్దుతండ్రి
సురుచియును గొడ్డతల్లియె యురువుగా నిను
నగవఁ జేయఁగ హేతు వీశ్వరుఁ డెఱుంగు. 28

క. పినతల్లి చెప్పినట్టుల
ఘనభక్తినిగల్గి నీవు కంజదళాక్షుఁ
మనమున నెంచిన సర్వం
బును నొసగుచు నతఁడె నిన్నుఁ బ్రోచును పుత్రా! 29

క. అని పల్కిన విని సంతస
మున నాతండెట్టివాడు పురమెయ్యది యా
తని నేమని పిలచెదరో
వినఁ గౌతూహలముఁ గల్గె వినిపించగదే. 30

గీ. తల్లి యప్పటి పల్కులఁ దలఁచుకొనఁగ
వచ్చుచున్నది దుఃఖము వారిగాను
ప్రాణమైనను వీడునుగాని జగతిఁ
మానమును వీడఁడెప్డభిమాన ధనుఁడు. 31

క. చెప్పుము భగవంతుఁడు నా
కెప్పగిదిఁ లభించు మఱియు నెట్టుల గొలువన్
మెప్పును గాంచును ? తన
మెప్పును జనియించుఁ జెప్పు మేర్పడఁ దల్లీ! 32

గీ. అనుచు నిలిచిన కొడుకు ధైర్యమున కలరి
బాలుఁడీతఁడు పాత్ర మెప్పగిదిఁ గలిగె
శాంతిపరచిన నీతఁడు శాంతిఁ బూనఁ
డయిన నిట్టుల జెప్పెద నని తలంచి. 33

ఆ వె. "కోపముండెనేని కుల మంతరించును
కోపమునను మిగులఁ గుంటు కలుగు
కోపమున్నవాఁడు పాపంబొనర్చును
కోప మఘములందు గొప్ప సుమ్ము". 34

క. కావున కోపం బేటికి,
నీ వయసున నీకు నెవ్వరేనియు నగరే
దైవము గొలువుము సురుచికి
వేవేగమె పుట్టఁ జేయు వేయేల నికన్. 35

చ॥ అనవుడు నాతడిట్లనియె "నక్కట ! యేటికి నిట్టులాడెదో
జననిరో ! బాలుఁ డీతఁడిది శక్యముగాదనియెంచి పల్కితో
మనమెఱుగంగ గోరితివొ మాటలు పెక్కిలి కేల పుండరీ
కనయనుదర్శనంబెటులఁగల్గునొ యానతియిమ్ము నాపుదుక్".

గీ. పుత్ర ! మెచ్చితి నీదగు పూనికకును
దెలియఁ జెప్పెద శ్రీహరి దివ్యచరిత
మును సవిస్తరంబుగ విని మోదమలర
భక్తి భజియింపు శుభములఁ బడయగలవు. 37

క. ఇచ్చటఁ గలఁ డచ్చట లే
డెచ్చట నున్నాడొ యనుచు నెంచగ నేలా
మెచ్చిన వారికి దరిశన
మిచ్చును సౌఖ్యం బొసంగు నెంతయుఁ బ్రీతిన్. 38

క. రూపము లేదిక సర్వ
వ్యాపి యనంబడును మఱియుఁ బని కలిగిన చో
రూపముల కేమి లోపము
బాపురె ! హరిఁ బొగడ వశమె బ్రహ్మాదులకున్. 39

సీ. తన భక్తి ననిశంబు ఘనముగా వినుతించు
భక్తుఁడైనను మహాపాపియైన
కలవారిఁ జూచి యాకులపాటు నొందని
మునియైన మిక్కిలి మూర్ఖుఁడైన
నర్థి యాచింప లేదనకఁ బ్రీతి నొసంగు
ధనికుఁడేయైన నిర్ధనికుఁడైన
భక్తులఁ సేవించి ప్రణుతించి పూజించు
చదువరియైన జడుఁడైన

గీ. మెచ్చి దరిఁజేర్చి వారి కమేయ సుఖము
లిచ్చి పోషించు వాంఛ నీడేర్చు నెవ్వ
డట్టి కరుణాంబురాశి నారాయణుండు
భక్తజనకల్పతరువు నీ పాల లేఁడె? 40

సీ. కరిఁ గావఁ ద్వరగ మకరిఁని ద్రుంచినట్టి యా
ఘనునకు నినుఁ గాచుటనఁగ నెంత
శబరి విందుకు మెచ్చి సాయుజ్య మిచ్చిన
ఘనునకు నినుఁ గాచుటనఁగ నెంత
వలువ లొసంగి ద్రోవదిని రక్షించిన
ఘనునకు నినుఁ గాచుటనఁగ నెంత
పసిబాలుఁ గుణజాలుఁ బ్రహ్లాదుఁ గాచిన
ఘనునకు నినుఁ గాచుటనఁగ నెంత
గీ. కాన మనమున ధైర్యముఁ బూని యెవ్వ
డించుకైనను వెతకు చోటియ్యఁ బోక
సర్వవరదుని భజియించి శాశ్వతముగు
ఖ్యాతిఁ బూన యతింపు జగంబు మెచ్చ. 41

గీ. ఘనుడు మీతాత మనువు యోగములవలన
హరిని నచ్యుతుఁ గొలిచి యుదార సుఖము
లొంది యాముష్మిక ఫలంబు నొందెగాఁద
యేటికిక చింత నీవంత యాగునంత. 42

గీ. అనెడు తల్లికి మ్రొక్కి దీవనలు వడసి
క్రూర వనసీమలకు బోయె ధ్రువుఁ డభీష్ట
వాంఛ నీడేర్చుకొన నెంచి పట్టుఁబట్టి
పౌరుషం బెంతగలదో యా బాలకునకు. 43

ఉ. ఉల్లమునందు భీతిగొన కొంటరిగా నటు కాననేగుచో
బల్లము మిట్టలంచెద లవంబును నెంచడు కష్టమంచు భీ
తిల్లడు భారమంతయును దేవునియందున నుంచి యర్భకుం
డెల్లరపీడి పౌరుషమునే మదినెంచుచుఁబోవుచుండఁగన్. 44

సీ. శారద నీరదాచ్ఛ శరీర కాంతులు
నింగిపై నొకవింత రంగులీన
పాటలాంశుక జటాపటలి జీరాడుచు
సంజ కెంజాయల సంతరింప
తపనీయ యజ్ఞసూత్రము గాలి గదలుచు
తళుకు మెఱుంగు కాంతుల వెలార్ప
అంసావలంబి మహతి గాలి తాఁకున
తారతార స్వరోత్కారము మొఱయ
గీ. చేత జపమాల నోరనబ్జాశనమును
దివ్యకీర్తనల్ వెలయఁ దోతెంచె నపుడు
సకల లోక స్వతంత్ర పరిచారకుండు
నారదుండు విజ్ఞాన విశారదుండు. 45

సీ. బాలకా! యెందుండి వచ్చితెయ్యది పేరు
తలిదండ్రు లెవ్వ రెందులకుఁ బోదు;
పరికింపఁగా గొప్ప వంశమునందున
ద్భవ మొందినావని పలుకవచ్చు
నేటికీగతి నొంటి నేగుచుంటివి కాన
వనమృగంబు లటన్న భయము లేదె
యెవరైన దిట్టిరో నేఁ కారణంబుననో
దుఃఖ మొందితివంచు దోచె మాకు

గీ. దాచకిక చెప్పగదవయ్య నీ చరితము
సాధ్యమేమైన నేకొంత సాయపడెద
ననిన బాలుడు భక్తి సాష్టాంగముగను
దండమును బెట్టి తన చరిత్రం బదెల్ల. 46

క. వినిపి పగ నారదుండును
దన మనమున విస్మయమునఁ దన్మయుఁ డగుచున్
గనుమే బాలుర జననీ
జనకుల పలుకులకు నలిగి చలమూనుదురే. 47

గీ. అరయ నీతని కైదేండ్లు సరిగ లేవు
చలము సాధింప నేగెడు; క్షాత్రమనిన
క్షత్రియులదే ప్రశంసింపగావలయును
తెక్కొరులకుండ దున్నంతటిది గాదు. 48

క. అని నెంచి బాలకునితోఁ
దనుజాంతకు శౌరి హరిని దర్శించుటనన్
మనమున నేమని యెంచితొ
యనఘా! నీకిది యసాధ్యమని తోపదుగా. 49

గీ అర్భకా! యాటలాడు ప్రాయంబునఁగుఁ
గానఁ జరియింప నేటికిఁగొంత కలిగె
సురుచి యన్నంత నలిగి యిట్టురుగ న్యాయ
మా? యెఱుఁగుదె? మానావమానములను. 50

గీ. పుడమిఁ దపమును సేయ మాబోంట్లకైనఁ
గష్టముగ నుండ నీకు సూక్ష్మముగఁ దోచె
నశన మాదిగ నన్ని సౌఖ్యముల విడిచి
యుండఁ గలవారొకో రాజపుత్రుండ వీవు. 51

క. రాగదె బాలక ! నాతో
వేగమె నీ తండ్రి నిన్నుఁ బ్రేమింప ను
ద్యోగముఁ జేసెద నిటు లీ
వేగుట సరిగాదటంచు నేర్పడఁ జెప్పెన్. 52

చ. మునివర ! యేటికీగతిని బోధన జేసెదు ; వట్టియాస చూ
పినన్ బరయత్నముల్ విడిచి వెన్కకుఁబోదు నె యేను శ్రీహరిన్
గనుగొను మార్గ మేదయిన గల్గినఁ జెప్పుడు వేగ నాతనిన్
ఘనముగు భక్తితోఁ గొలిచి కాంచెద మేలు నినున్ స్మరించుచున్.

క. అనిన్ విని నారగుఁ డా
తని దృఢ సంకల్పమునకు ధైర్యంబునకున్
ఘనముగ మెచ్చుచు నిట్లనె
తనయా ! శ్రీహరిని గను విధం బెఱిఁగింతున్. 54

చ అనఘ ! నినున్ మరల్పనఘుమబ్బునటంచునుదోఁచె; నిన్నునీ
పనికిరమామనోహరు డవశ్యగాఁ బురికొల్పుటన్ సుధీ
జనులు నుతింప భక్తి ముని సన్నుతు నర్వఫల ప్రదాత నా
ఘనుని మనంబునన్ గొలువగాఫలమబ్బకయున్నె పుత్రకా!

గీ. సారమును లేని పదముల జలజనాభు
ధ్యాన మొనరించుటయుఁ దపం బనఁగఁ జెల్ల
దర్థవంతంబునై మహిమాన్వితమగు
మంత్రమునఁ గొల్వ నీ యాభిమతము దీరు. 56

క. కావున నీకా మంత్రం
బో వత్స ! దయాగ్రబుద్ధిఁ నుపదేశింతున్
నీ వద్దానిని శుచియగు
కావున జపియించ ఫలము తప్పక కలుగున్. 57

గీ. వేగ యమునానదీతీర మేగి మధువ
నమున జపియింపు మది ప్రశస్తముగనుండు
ననుచు నారదమౌని యా యర్భకునకు
ద్వాదశాక్షర మంత్రంబుఁ దనరఁజెప్పి. 58

క. "అరుణోదయంబు కాగా
సరగున మేల్కాంచి యపుడె స్నానాదికముల్
వరుసగ దీర్చుచు భక్తిని
హరి భజియింపంగ శుభము లబ్బును బుత్రా!" 59

గీ. బుద్ధినిలిపి బాహ్యాంతర శుద్ధిఁ గలిగి
హృదయ సింహాసనమున రమేశునిలిపి
నిశ్చలంబగు భక్తి ధ్యానించుచుండు
కమలనేత్రుండు నీకు సాక్షాత్కరించు. 60

క. అంతయు హరిమయమని జగ
మంతయు నీశ్వరుని లీలయని మానసమం
దెంచుచు భక్తిని గొలిచినఁ
జింతలు దవ్వోగుఁ ఫలముఁజేకురుఁ బుత్రా! 61

గీ. అనుచు ధ్రువునకు నారదుఁ డప్డు ప్రీతి
హరిభజియింపదగు విధమంత దెలిపి
త్వరగ నుత్తానపాదుని తావు కరిగె
సుజనులెప్డు దొరుల మేలు చూచుచుంద్రు. 62

గీ. అచట నుత్తానపాద దరాధినాధు
డాత్మజుఁడు ఘోరవనముల కరుగు పిదప
దాను పుత్రునిపైన ననాదరముఁ జూపి
కరుణఁ గనకుండుటకుఁ జింత గడలుకొనఁగ. 63

ఉ. "హా సుగుణాకరా! తనయా! హా కులవర్ధన! మానభూషణా!
భాసురరూప ప్రేమమయవాక్యములం జేతులనెత్తి చేర రాం
ద్రోసి పరాభవించితినితో య్యాలిపైఘనమోహముండుటన్
మోసము జెందినాడ నిటు బుట్టునటంచెఱుగంగనైతిగా. 64

చ. సురుచి కుయుక్తులన్ గనక సూరుల నీతివచఃప్రభావమున్
నిరసనజేసి యెప్పుడవినీతుడనై విషయేచ్ఛలన్ సదా
మరగి మహాపతివ్రతను మంజులరూప సునీతి నెప్డు వం
దురగ నొనర్చియుంటి గుణధుర్యుని నిన్నును భంగపెట్టితిన్.

ఉ. ఎచ్చటికేగితో తనయా! యెంతగ దూరితో తండ్రిసైతమున్
మచ్చరమూని చేరం జన మంజులభాషల నాదరింప డం
చచ్చపు చీకటింబడితి నజ్ఞుడనైతి క్షమించి రాగదే
చెచ్చెఱం నాదు కౌంగిటను జేర్తు మదిన్ గల కోర్కెదీరగన్.

ఉ. రాజకులోద్భవుండ మిగులన్ గణనీయుండ పుత్రుడన్ ననున్
వ్యాజములేక యే సురుచి యత్యధికంబుగ దిట్టిపోసె నా
పూజను దేమొ తండ్రియును పుత్రుడటంచని యెంచడాయెనా
కీజగమే రుచింపదని యెందులకేగెనో యేమియయ్యెనో. 67

సీ. సురలార! కావరే సుఖము గల్గగ జేసి
మాకుమారునిబోలు నాకుమారు
మునులార! యనిశంబుగని కటాక్షించరే
మాకుమారునిబోలు నాకుమారు
ద్విజులార! యాశీర్వదించి బ్రోవరె యెప్డు
మాకుమారునిబోలు నాకుమారు
వనదైతములార! ఘనకృపజూడరే
మాకుమారునిబోలు నాకుమారు

గీ. బాలు సుగుణాలవాలు సద్వంశజాతు
ధ్రువునిజూపుఁడు పుణ్యంపు దోవఁగనుఁడు
వృక్షతతులార! గిరులార! పక్షులార
కరుణనింపుడు కూర్రమృగంబులార. 68
గీ. సూర్యభగవానుడా నీకు జోతలిడుదు
నీవు మెట్టని చోటులేలేవు నిజము
గాన యభిమానమూని జగాన దిరుగు
నపుడు నాస్థితిఁ జెప్పుమా యుతనితోడ. 69
చ. నలువ! సమస్తజీవుల ననారతమును బసిఁబూనిసృష్టియున్
సలిపి యథోచితంబుగను చావును గల్పన జేతువంట నిన్
దలచెద నెల్లవేళలను నాసుతు నెప్పటికైనగాని క
న్నులఁగన నాయువిచ్చియు మనోరథ సిద్ధినిజేయ వేడెదన్.
సీ. నిండు చందురు బోలు నీ మోగంబును గాంచు
నట్టి భాగ్యం బెప్పుడబ్బు నోకొ
పల్కుపల్కున తేనె లొల్కు పల్కుల నెప్డు
వీనుల విందుగా విందు నోకొ
విలు విద్యయందు నీకిల సాటిలేరని
వినెడు సమయము మెప్డు గనెద నోకొ
ప్రజలెల్ల రిది రామ రాజ్యమంచని మెచ్చ
ధరనేలి యెప్పుడు వరలె దోకొ
గీ. నిన్ను గాంచెడి ప్రాప్తి నాకున్న దోకొ
అన్న! విమలమౌ నీ గుణం బెన్నలేక
చేతులారగ విడిచితి సిగ్గుమాలి
మోహమున గల్గినట్టి దుర్బుద్ధి కతన. 71

క. అని దుఃఖించుచు సురుచిః
ఘనముగ దూషించి దిక్కు గానక యకటా!
తనయుం డరిగిన జాడల
గను టెట్లని చింత సేయు కాలము నందున్. 72

గీ. పరుగు పరుగున నటకు దౌవారికుండు
వంతఁ గుందెడు నుత్తానపాదు కడకు
వచ్చి త్రిభువన సంచారి పద్మభవుని
యాత్మజుడు వచ్చెనని తెల్ప నాలకించి. 73

క. మనుజాధీశ్వరు డప్పుడు
మునికుల చందురునిఁ జేర ముదమునఁ జని తా
వినయంబున గేల్మోడిచి
గొని వచ్చె గృహాంగణమునకును గడుఁ బ్రీతిన్. 74

ఉ. హెచ్చినభక్తినప్పుడు మునీంద్రునిపాదములంటిమ్రొక్కి యా
సచ్చరితాగ్రగణ్యునకు స్వర్ణమయాసన మిచ్చి దేవ! నీ
వచ్చుటచేత నా గృహము పావనమయ్యె ముదంబుగంటి నీ
వెచ్చటనుండి యెచ్చటికి నేగెదు వార్తలు తెల్పవే కృపన్. 75

ఉ. నారద మౌనిసత్తమ! యనారత మోపికతోడ లోక సం
చారముఁ జేసి వార్తలనుసత్వరతన్ గ్రహియించి తాపముల్
దీరుతు వీవు నావయిని దివ్యకృపామృతధార నుంచి ని
స్సారము నా మనంబునకు సారతఁ గూర్పుమటన్న మౌనియున్.

ఉ. ఎల్లరు సేమమే? సతుల నిద్దఱఁ గూడి సుఖింతువే? మరే
యల్లరి లేక రాష్ట్రమున నందఱు సౌఖ్యముతో వసింతురే
యెల్లవిధంబులన్ ధ్రువుని యిష్టము దీర్తువె? దుఃఖవార్ధి నీ
వెల్లపుడున్ మునింగినటులేర్పడు కారణమేమి? భూవరా! 77

ఉ. నావుడు పార్థివుండు వదనంబున విన్నదనంబుదోప, స
ద్భావముఁ గల్గి దీనుల నపారకృపన్ గని దుఃఖమంతయున్
బోవఁగఁ జేయఁ గల్గు మునిపుంగవులౌ మిముఁ గాంచినంతనే
నా వెతలెల్ల దీరునను నమ్మిక మొక్కెడు నాకుఁ జేకుఱెన్. 78

ఉ. సారవిహీన సంసరణ సంగతి మిక్కిలి కష్టమౌట నే
సారి మునింగి తేలుచు ననిశంబును దుఃఖముఁ జెందునట్టి సం
సారుల నుద్ధరించుటకు జక్కని నావ భవత్పదాబ్జ సే
వారతి భారమెంచక కృపామతిఁ బ్రోవవె తాపసోత్తమా! 79

చ. అనుపమరూపయౌ సురుచి యల్లిన ప్రాభ్రలసంకెలల్ గళం
బున నరికట్టఁ గట్టుపడి పూజ్యగుణాఢ్య సునీతిరోసి నా
తనయుని వంశవర్ధను నెదన్ గరుణింపక దిట్టి కొట్టగా
విని సహియించితిన్ సురుచి ప్రీతిగడింపగ మూఢబుద్ధినై. 80

గీ. తనయుఁ డగుపింపఁడాయె నా దినమునుండి
యేడ కేగెనో బ్రతికియున్నాడొ లేడొ
వాని జాడను దెల్పెడువారు లేక
కరముఁ గుందుచునుంటి నిక్కము మహాత్మ! 81

క. జనపాలుం డీ విధమునఁ
దన దుఃఖము వెల్లడింపఁ దాపసు డపుడా
వనమున నవ్వోలనాగ ని
ట్లనియెన్ గామాంధులు పాపమని వెరతురొకో. 82

చ. గతజల సేతుబంధనము గాదొకొ నీవిపుడేడ్చుచుండుటల్
మతిజెడి జ్యేష్ఠపత్ని కవమానముఁ గల్గఁగఁ జేసి కౌతుకో
ద్ధతిసురుచిన్ దలంచుచు సదా యధరామృతపానసౌఖ్య మొం
దతివ విసర్వమున్ మఱచి నిక్కము లాభమె యిప్పుడేడ్వఁగన్.

చ. కనుగవయందమున్ మొగముకాంతికి చోన్నతిమందయాన
మున్, ఘనచతురత్వమున్ గలుగు కామినిఁగౌఁగిటఁ జేర్చు టే
సుఖం,బనిమది నెంచి స్వేచ్ఛగవిహారముసల్పుచునక్కటా!జనుం
డనిశము మోహవార్ధిఁబడియావల చింతిలినన్ ఫలంబొకో. 84

చ. పతినిదలంచి లేవగనె భక్తి నమస్కృతు లాచరించి స
మ్మతమగు కార్యముల్ సలిపి మాధవునిన్ నుతియించి ప్రేమమై
నతిథులగౌరవించి వినయంబును బెద్దలపట్ల జూపుచున్
హితముగనుండు భార్యలను నేలకొ మెచ్చరు భర్తలిద్ధరన్.

గీ. నిరతమును దన్నుగోరు సునీతి విడిచి
సురుచి వలపున జిక్కెను ధరణి నాథు
డనెడు పలుకులు మాబోంట్ల కధిక కోప
మును గలుఁగఁ జేసె విను మొగమాట మేల ? 86

గీ. అది మొదలు నిన్ను గాంచిన నఘము గల్గు
నంచు వెలిపొంది యిటకు రామైతి మీవుడు
పాప ఫలమును బొందగావలదె నీకు
కట్టికుడువదె చేసికొన్నట్టి కర్మ. 87

క. పరితాపముఁ జెందితి వి
త్తరి నీ పాపంబు సమయు ధరణీనాథా !
పరమాత్ముని కృపచే నే
వెలిపొందదు పుత్రుడిఁక భీతిల నేలా ? 88

గీ. కానలో దన పుత్ర రక్షణకు నెట్టి
రక్ష బంధించెనో పతివ్రత సునీతి
అదియె కాపాడు నన్ని యాపదలనుండి
వగవు జెందగ నేల నిర్భయుతనుండు. 89

క. నీ పుత్రుఁడు కడు భక్తిని
తాపసమందారుఁ నఘవిదారున్ హరిఁ దీ
ప్తాపరుఁడయి గొలుచుచు ఘన
తాపసులొందని వరంబు దానొందు నృపా! 90

క. హరినామస్మరణము భీ
కర శత్రుచ్ఛేదకము, సుఖప్రదమును, స
ద్వరదాయక మఘహరమౌ
వరుసన్ భజియింపగా శుభంబులు గొనువే. 91

గీ. అనుచు నారదుఁ డప్డు ధరాధినాథుఁ
గుందవలదని చెప్పి తానెందొ చనియె
నమరమునిమౌళి బోధమయ్యమృతవృష్టి
యై మహారాజు హృదయంబు నలరఁ జేసె. 92

ఉ. అచ్చట రాజనందను డహర్నిశముల్ శుచియై నిరంతరం
బచ్చపుభక్తిమీఱ దనుజాంతకు నెమ్మనమందు నిల్పి, యే
యిచ్చయు లేక నన్నిటికి నీశ్వరుడే శరణంచు శ్రీహరిన్
మెచ్చఁగఁ గొల్చి సత్ఫలముఁ జేకొన నెంచి దృఢవ్రతుండునై.

సీ. దినమునం దొకసారి వనఫలంబుల దెచ్చి
తినుచు శ్రీరమణుని వినుతి సేయు
వఱువాత నొక కొన్ని వారముల్ సలిలంబు
ద్రావి తత్పాద పద్మముల దలఁచు
నటుపైన బవనంబు నాహారముగ గొని
భక్తిచే పరవశత్వంబు నొందు
దనుఁగావ దయఁబూని వనజాక్షుఁ డరుదెంచె
నని చూచి కానక కనులు మూయు

గీ. నహహా ! యేమని చెప్ప నాయర్భకుండు
చిత్తశుద్ధిని మేను శుష్కింపఁ జేసి
మానుల కగోచరుండు సంపత్ప్రదుండు
నైన హరిఁ గొల్చుచుండె నత్యధికనియతి. 94

క. ఇవ్విధమున భజియించుచు
రవ్వంతయు ఫలము గనక రాజకుమారుం
డవ్వనజాక్షుని మదిలో
నివ్విధమున బొగడె దా నభీష్టము దీరన్. 95

ఉ. తావక దివ్యరూపమును దప్పక నెమ్మనమందు నిల్పి, నన్
గావఁగఁబ్రోవవీవయని కంజదళాక్ష! యహర్నిశంబులన్
భావమునందు నేమరక పాలననేయుమటంచు వేడినన్
రావు; కృపామయుండవని నారదుఁడేటికిఁ జెప్పెనో గదా.

చ. జనకునియంక నుండుట కసమ్మతి గల్గగ సృష్టికంతకున్
జనకుడ వీవయంచు నినునమ్మితి; రాజ్యరమావిలాసముల్
ఘనముగ గల్గునంచు సకలంబును వీడితి; భవ్యనిష్ఠనన్
మనమునఁగొల్చుచుంటినిర మావర! దర్శనమియ్య వేలొకో?

ఉ. దేహము తల్లడిల్లె విరతిన్ గనునోయను జీవితంపు సం
దేహము తోచుచుండె నిను నెమ్మది భక్తినినిల్పినిచ్చలున్
పాహియటంచు వేడిన కృపాగుణమున్ విడి నీవిటుల్ నిరు
త్సాహముఁ జూపితేని యనదన్ భువి నెట్టుమనంగ నేర్తునో.

క. అని యివ్విధిఁ బరమాత్మున్
ఘనముగఁ బ్రార్థించుచుండి కనులన్ మూయన్
మునిగణమందారుం డా
వనజాక్షుం డపుడు ధ్రువునివలన ముదితుడై. 99

చ. కరమునఁ జక్రమూని తనుకాంతి చతుర్దిశలందు వెల్గగా
మురిపెముతోడ భక్తునకు మోదముగూర్ప ఖగేశునెక్కి స
త్వరముగ నేగుదెంచె భగవంతుఁడనూన కృపాంతరంగుడై
యరయఁగ భక్తశేఖరుల కాపదలైన సహింపనేర్చునే. 100

గీ. వచ్చి యాతని నిశ్చలత్వమున కలరి
తలపయిని ప్రీతి నభయహస్తంబు నుంచి
వత్స! నీ కోర్కె నీడేర్ప వచ్చినాఁడ
చాలు నిక లెమ్మనుచు బల్కె సత్వరమున. 101

ఆ. వె. అక్షియుగము విప్పి హరి తన చెంగట
నభయదాతయై కరాబ్జమెత్తి
యుండఁ జూచి బాలుఁ డుప్పొంగి కమలేశు
నిటు స్తుతించె భక్తి యినుమడింప. 102

క. జయజయ శ్రీరమణీ ప్రియ!
జయజయ కరుణాసముద్ర! జయసర్వేశా!
జయజయ వాసవవందిత!
జయజయ కరిరాజవరద! జయగరుడాంకా! 103

ఉ. ఎంతతపంబు జేసితినొ యెంతటినోముల నోచినాఁడనో
యెంతగ దానమిచ్చితినొ యేఁదొలి జన్మమునందు మౌనులెం
తెంతొ తపంబుజేసిన నొకింతయు దర్శనమీని నీవు నా
యంతటివాని కబ్బితి వహా! కడు ధన్యుడనైతి మాధవా!

ఉ. పాపము వృద్ధియై జగము పాపులచే వెతలొంద ధర్మ సం
స్థాపనఁ జేయ నెన్నియొ విధంబుల నుద్భవమంది దుష్టులన్
రూపడగించి సత్పథచరుల్ ముదమంద జరించు భక్త సం
దీపక! నీకృపాసరసి దేల్చుము దుఃఖముఁ ద్రుల్చి మొయ్యనన్.

మ. మునిసంసేవ్యములై మహత్తరములై మోదావహంబై మహా
ధనధాన్యాది సమస్తవైభవదమై దారిద్ర్య విచ్ఛేదియై
ఘనసంసార మహాంబురాశి గడవంగా జేయు నీ పుణ్య ద
ర్శనలాభంబును గంటిమంటి జగదీశా! భక్తకల్పద్రుమా!

క. అని యివ్విధి స్తోత్రము జే
సిన బాలుని భక్తికెంతొ చిత్తమునందున్
ఘనముగ నుప్పొంగుచు ని
ట్లనియెన్ ధ్రువుఁ జేరఁదీసి హరి ప్రీతుండై. 107

ఉ. హెచ్చుగ సంతసం బొదవె నెంతయు భక్తినిగొల్చితీవు రా
లచ్చి నినున్ వరింప బుధలాలితమౌ గతి రాజ్యమేలి ని
సచ్చరితంబు నెల్లరును సంస్తుతిజేయ యశంబుగాంచి, నన్
జెచ్చెరఁ జేరెదీవు వగజెందగనేటికి లెమ్ము పుత్రకా! 108

గీ. వరమొసగి యాప్తు డారమావరు డదృశ్యుఁ
డగుటఁ గన్గొని చింతించి యర్భకుండు
తనదు పురిజేర వచ్చె నాయనఘు డట్లు
వచ్చుచుండుట నుత్తానపాదు డెఱిగి 109

గీ. అంధునకు దృష్టి గలిగిన యట్లు పేద
పెన్నిధిని గాంచి చెలరేగు విధము సంతు
గనిన గొడ్రాలు హర్షించు గతి నృపుండు
సంతసంబున నుప్పొంగి సత్వరముగ 110

క. కరి తురగాదుల గొని నా
దరమున నెదురేగి సుతుని దాక్షిణ్యమునన్
కరిపై నెక్కించియు నా
పురవీధుల వెంటవచ్చె ముదము దలిర్పన్. 111

సీ. మేడలపైనెక్కి మేదినీ వరసుతుఁ
గౌతూహలంబున గాంచువారు
శైశవంబున నిట్టి చలము సాధింపగా
నితనికే తగునంచు నెంచువారు
తల్లిదండ్రులయెడఁ దగ వసించెడి బాలు
డటవి నెట్టులనుండె ననెడువారు
మద్రసోపేత భోజనముఁ జేసెడు మేటి
యాశనంబు నెటువీడె ననెడువారు

గీ. సౌధములనుండు బాలుడు సర్వ సౌఖ్య
ములను త్యజియించి పినతల్లి బలికినట్టి
కటుక వాక్యంబులకు వేగ కాన జనియె
ననెడు వారౌచు జనుల బ్రియుంది రపుడు. 112

క. మంగళములు బాడుచు ది
వ్యాంగన లాశీర్వదించి హారతులెత్తఁ
రంగారు గజముపై మేల్
బంగారు మెఱుంగు బొమ్మవలె ధ్రువుఁ డలరెఁ. 113

ఆ. వె. అంత సుతుని డ పి యనుకంప జనియింప
కౌఁగిలించి మిగుల గారవించి
యతని తల్లిచెంత కంతఃపురంబున
కనిపె పార్థివుండు హర్షమొంది. 114

ఉ. బాలుని గాంచినంతనె గుభాలున లేచి సునీతి పెక్కుచం
దాలఁబ్రియంబుసూపుచును తా! యనియక్కునఁ జేర్చిపల్లెభా

పాలుడు నీకునై మిగుల వందురుచుండెను గాంచితే యనన్
బాలుడు తండ్రిఁ గంటినని భక్తి నమస్కృతిఁ జేసె తల్లికిన్

క. సురుచియు వెంటనె ధ్రువు నా
దరమునఁ దనకడఁకు బిలిచి తన పగనవలన్
దరిమి మృదూక్తుల సేమం
బరసెను గనువారలెల్ల నబ్బురపడఁగన్. 116

ఉ. అంతటఁగొన్ని నాళ్లకు ధరాధిపుడెంతయు వేడ్కతో సుతున్
జెంతకు బిల్చి రాజ్యమును జేకొనుమంచు వచించి నీతు లెం
తెంతయొ జెప్పి తా నటవికేగ ధ్రువుండటు తండ్రి పోవనిన్
వంతలఁ బాపి భూప్రజలఁ బాలనసేయుచు నుండునయ్యెడన్.

ఉ. ఉత్తముఁడొక్కనాడు తనయుత్తమసైంధవమెక్కి సైన్యమా
యుత్తము జేసి వేగమృగయార్థముబోయి గృహంబు జేరమిన్
దత్తఱపాటుతో సురుచి తా వనికేగి కుమారుఁ గాంచ బో
కత్తఱిఁ బ్రాణముల్దొరఁగె నా ధ్రువుడీవిషయం బెఱుంగుచున్.

క. తమ్ముని జంపిన పగ యు
ద్ధమ్మున యక్షులను జంపి తగ దీరిచి న్యా
యమ్మున ధర నేలి ఖగో
ళమ్మున నుడురూపమున మెలంగును నేడున్. 119

ఉ. పంకజనాభ ! నీచరణపంకజముల్ మదియందు నిల్పి, యా
టంకము లేక వ్రాసితి హుటాహుటి భక్తునిగాథయొందు; నా
వంకఁ భవత్కృపామృతము పర్వఁగ జేయుచు నుద్ధరింపు మే
సంకట మొందఁబోక నిను సన్నుతి జేసి సుఖించుచుండెదన్.

ఉ. ఇమ్మహిఁ నీచకృత్యము లవెన్నియొ సల్పుచుఁగుక్షి నింపి, భా
గ్యమ్మనుగోరుక ంటెభవదంఘ్రుల నంకితముగ్ బొనర్చి గ్రం
థమ్మొక డిచ్చినన్ బరమధన్యుడ నౌదునటంచు నీ చరి
త్రమ్మును వ్రాసియుంటి రవితారకమై వెలయింపవే ధరన్.

—◆ గద్య. ◆—

ఇది శ్రీరమామనోహర కరుణాకటాక్ష
లబ్ధ కవితాధారేయ సజ్జన విధేయ
గంధం తాయారంబా కృష్ణ
మాచార్య జ్యేష్ఠ తనూభవ
వేంకట నృసింహాచార్య
ప్రణీతంబైన ధ్రువ
చరిత్రంబను గ్రం
థమునందు
సర్వము
సంపూ
ర్ణము.



# కవితాప్రశంస.

ఉ. మాధవ భక్తశేఖరుఁ డమందిత కీర్తిపరాయణుండు వి
ద్యాధనరాశి సత్కృతులనంతముగా రచియించినట్టి సం
బోధితమానసుండు పరిపూర్ణకృపాకరసాధుశీలుఁ డా
రాధితనారసింహుఁడవురా ! చరితార్థుఁడు సర్వభంగులన్

ఉ. నీకు జయంబు వాణియును నీ వదనంబున నాట్యమాడుతన్
ప్రాకట సౌఖ్య సంపదలపారముగా లభియించు గావుతన్
నీ కృతులుండుగాత శశి నీరజబాంధవు లుండుదాక ర
మ్యాకృతిదాల్చి కాంచుము చిరాయువుమాధవభక్తశేఖరా!

శ్రీరమానాథుఁ డెల్లప్డు శ్రీలనొసఁగు
మాధవశతకంబు రచించు మాన్యుఁడగుట
ధ్రువచరిత్రంబు వ్రాసిన దొడ్డ ఫలము
వారకలభించు ద్వరలోన నారసింహ !

రామసుబ్బారాయఁడు, బి. ఏ.,
ప్రెసిడెంటు.
స్నేహలతా కవితాసంఘము,
కొల్లాపురం,
జటప్రోలు సంస్థానం.
6—4—1932.